# స నా త న సా ర థి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 15 జూలై '72 సంచిక 6

## విషయానుక్రమణిక

—:చిత్రము:—

అనంతపురం కాలేజీ మిద్దెపైనుంచి శ్రీవారు దిగివచ్చుచున్న దృశ్యము:



---

: హెచ్చరిక :—

ప్రశాంతినిలయమున పాతషెడ్లు, ఇండ్లు, తీసివేసి, క్రొత్త షెడ్లు, ఇండ్లు ట్యాంక్లు మొదలైన కట్టడపు పనులు చురుకుగా సాగుచున్నవిగాన, దసరా పండుగవరకు ఇక్కడకు వచ్చు భక్తులు, దర్శనావకాశములు వసతులు మొదలగు సౌకర్యములు లేక, చాల యిబ్బందుల పాలగుదురని అందరికీ తెలుపడమైనది.

చందాదారులకు విజ్ఞప్తి

రసీదు నంబర్లు TC 5326 నుండి 6727 వరకు చందాదార్లు తమరసీదులనుచూచి సెప్టెంబర్'72 సంచికనుండి కట్టవలసిన క్రొత్తచందాలు (రు॥4) ఇదివరకు పంపనియెడల. కార్యాలయమునకు ఆగష్టు '72. 15వ తేదీలోపల చేరునట్లు పంపవలయును.



# రామ కథా రస వాహిని

శ్రీసత్యసాయిబాబా

30

"నీవే పట్టాభిషేకము గావించు"

దశరథుడు కైకను యెట్లయినను మంచి చేసికొని, రామపట్టాభిషేకము పూర్తిగ నెరవేరునట్లు చూడవలెనని తలంచి, "ఓ! దేవీ! నీవు మంగళస్వరూపిణివి! నేనింతవరకు నిన్ను ప్రాణ సమముగా చూచితిని; నీవునూ నన్ను హృదయ సమముగా కాపాడితివి. ఈ మిగిలిన కాలములో, ఈవిధమైన అపోహలకు చోటివ్వక, శేషకాలమును శాంతముగా సంతోషముగా గడుప ప్రయత్నింతము.

ఓ! సుశ్రోణీ! నేనిక యెంతోకాలము బ్రతుకను! ఇంతకాలము సత్యవ్రతుడనని పేరుపొంది సర్వమానవ మన్ననల నందుకొని బహిరంగసభలో, రేపటి దినమున శ్రీరామచంద్రునికి పట్టాభిషేకమును గావింతునని శపథము చేసితిని. రేపటిదినమున, ఈమంగళకార్యము జరపకున్న లోకులు నన్నెంత నిందింతురో! నన్నెంత అవమాన పరతురో! నీవేయోచింపుము.

దేవాసురయుద్ధమున, నన్నుకాపాడి, ఈనాడునన్ను పరాభవము చేయుట, నీకే మాత్రము న్యాయముకాదు, పోనీ! ఈరాజ్యమంతయూ, నీకు వరదానముగా నిత్తును. నీవే రామునికి పట్టాభిషేకము గావించుము! ఇందుకు భరతుడు కూడనూ అమితానంద పడగలడు.

అంతేకాదు! గురువులు, ఋషులు మంత్రులు ప్రజలు, ఒకరేమి లోకమేనిన్ను మెచ్చుకొనును. నీయశస్సు లోకములో శాశ్వతముగానుండి పోగలదు.

అట్లుకాక, ఈనాడునీవు రామాభిషేకమునకే అడ్డుతగిలిన లోకులంతా నిన్నునిందింతురు. నీచపరతురు. నీకొమారుని సహితము తూలనాడుదురు. నీవలన రాజ్యమునకే కాక వంశమునకే అపకీర్తివచ్చును. నీవు ప్రతి చిల్లరవాని చేతను ఛీ! ఛీ! అని అనుపించుకొన వలసివచ్చును.

బాగుగా యోచించుకొనుము! శాశ్వతకీర్తిని గోరి ఈపట్టాభిషేకమునకు అడ్డుతగులక, రేపటిదినము నీ

చేతులార రామచంద్రునికి అభిషేకము గావింపుము అని ఆమెను ఆనందపెట్టుటకై అనేక రకముల మృదుమధుర మైన మాటలాడుచున్న దశరథుని చూచి, కైక

"చెప్పిన మాటలు చెల్లించండి"

రాజా! మీమాటలు అతి విచిత్రముగా నున్నవి చెప్పిన మాటలను తప్పించుకొను నిమిత్తమై మీరు వేయి పన్నాగములు పన్నేమాత్రమును మార్చజాలవు. ఏమి కావలెయునో కోరుకొమ్ము, యిత్తునని, మీరే వాగ్దానముచేసి, చెప్పినటుల చేయక నేడు ఈవిధమైన బాధలను ప్రదర్శించుట మీకు పాడికాదు. మీగౌరవ మర్యాదలను మీరే వమ్ము చేసుకొనుచున్నారు, కానీ, ఇందుకు నేనేమాత్రము బాధ్యురాలను కాను.

సత్యమే పరమధర్మమని ధర్మవేత్తలు చెప్పుమాటలను జ్ఞప్తికితెచ్చుకొనుడు. నేనుకూడనూ ఆ ధర్మాన్ని అనుసరించే, మీరు వాగ్దానము చేసిన వరములను చెల్లించమని కోరుచుంటిని. అందులకు మీరునూ, సరే!; అని ఒప్పుకొంటిరి.

ఇప్పుడు, నేనేమిటో అన్యాయమునకు ఒడికట్టినటుల, మహాపాపమునకు పూనుకొనినటుల, తమకు తీరని అపకీర్తి తెచ్చిపెట్టినటుల, పలుకుచున్నారు; ఇది యేమాత్రమూ న్యాయముకాదు. ఇందులో నాది యేమాత్రమూ

దోషములేదు.

ముందు వెనుక యోచించక, మీరు మాటలనిచ్చి క్రియారూపమునకు దిగినపుడు తబ్బిబ్బగుట తమలోని దోషమే! వాగ్దానమును చెల్లించలేనివారు వాగ్దానము చేయుట మహాపాపము. చెప్పిన మాటలను చెల్లించితిరా యెట్టిపాపమైనను సత్యవాక్యాచరణముతో నశించగలదు.

"పూర్వపు రాజుల సత్య వాక్పరిపాలన"

మీకు తెలియదా? పూర్వము శైబ్యుడు అను రాజు ఒక పావురమును కాపాడుదునని మాటయిచ్చుటచే మాటను నిలబెట్టుకొను నిమిత్తము తన దేహములోని మాంసమును కోసి డేగకు యిచ్చెను.

అదేవిధముగా అలర్క మహారాజుమాటను నిలబెట్టుకొనుటకై ఒకానొక బ్రాహ్మణునకు తనరెండు కన్నులను తీసియిచ్చెను. సమస్తనదులకధిపతి అయిన సముద్రుడు, సత్యవ్రతము వలననే, తన పొలిమేరను దాటిరాలేక పోవుచున్నాడు.

రాజా! వేయేటికి? అన్నింటికీ అందరికీ సత్యమే పరమప్రమాణము; ప్రాధాన్యము; సత్యమే శబ్దము; సత్యమే బ్రహ్మము అదే ధర్మము. సత్యమొక్కటే అక్షయముగా నుండునది అట్టి అక్షయపదమును వీడి క్షయ

మగువాటికై మీరు ప్రయత్నించుట, మీబోటిరారాజులకు తగనిది.

మీరిచ్చినమాటను నెరవేర్చుకొని శాశ్వతకీర్తిని నిల బెట్టుకొనుడు! అంతేకానీ, పుత్ర వాత్సల్యమునకు, స్త్రీ వ్యామోహమునకు లొంగి రాజనీతిని, ప్రభుకీర్తిని ఉల్లం ఘించి యిక్ష్వాకువంశమునకు తీరని అపకీర్తిని తెచ్చిపెట్ట కండి! వేరుగాయోచించక, తక్షణమే రాముణ్ణి పిలిపించి అరణ్యమునకు సిద్ధముకమ్మనిచెప్పి భరతుని రప్పించుటకు తగిన యేర్పాట్లు గావించుమని మంత్రితో తెలుపుట మంచిది. తెల్లవార వచ్చుచున్నది. ఈ రెండునూ తెల్లవారులోపున జరిగియే తీరవలయును.

దశరథుడు మూర్ఛతో పడిపోవటము

మీరెన్ని చెప్పిననూ, నేను తృప్తిపడను. అట్లు గాక మీరు మొండిపట్టుతో రామ పట్టాభిషేకము గావిం తురా—నిండు సభలో నేను ప్రాణములు వీడుదును. ఇది సత్యము.

అని, అతి తీవ్రముగా మాటాడునట్టి కైకనుచూచి దశరథుడు మహారౌద్రుడై, కోపమును మ్రింగలేక వెలు పల పెట్టలేక, వామనమూర్తికి మాటయిచ్చి తప్పించు కొనిపోలేని బలిచక్రవర్తివలె దశరథుడు ధర్మశాపబద్ధు డయి పోయి.ాడు. కన్నులు మబ్బులు క్రమ్మినవి.

తల బరువెక్కినది. నేల వ్రాలినాడు.

కడకెటులో ధైర్యమును తెచ్చుకొని "పాపీ! నేడు రామాభిషేకము నిల్పిన, నేను ప్రాణములు వీడుట తథ్యము. తరువాత ముండవై ఈ రాజ్యమును నీయిష్ట మువచ్చినటుల యేలుకొమ్ము" అని ఉద్రేకపూరితముగా పలికి,

"హా! రామా! నాచేతులారా నిన్ను అరణ్యమునకు పంపవలసి వచ్చెనా? నేను పంపను. నా ప్రాణముల నయిననూ వీడుదును. కాని నిన్ను విడిచియుండలేను. ఓ రాక్షసీ! నా సుకుమార సుందరుని కారడవులకంప నీ మనసు యెట్లొప్పెను? ఎంత కిరాతకురాలవైతివి. చండీ! అంటూ మూర్ఛతో పడిపోవును.

### పట్టాభిషేకమునకు పద్ధతులు

తెలతెలవారు చున్నది. నవధ్వనులు వాయించదొడ గిరి. రాజవీధులలో పన్నీరు జల్లదొడగిరి. పురమంతయూ సుగంధములతో నిండెను. సువాసనలతో వాయువు ఉత్సా హముగా ఆకసమునంటెను. పుష్యమి నక్షత్రము ప్రవే శించెను. వశిష్ఠమహర్షి, ఆయన శిష్యబృందముతో సరయూ నదిలో స్నానముచేసి, అభిషేకద్రవ్యాలతో రాజవీధులలో మహాజనము మధ్య, రాజభటులు దారిని విడిపించుచూ రాగా మహర్షి రాజప్రాసాదములోనికి ప్రవేశించెను.

అప్పటికే, అనేకమంది పురోహితులు, రాజులు, ప్రజాప్రతినిధులు ఆవరణములో ప్రవేశించి, వారివారి స్థానములలో ఆసీనులైనారు.

వీధులలో వేదపారాయణము మిన్నుముట్టుచున్నది. ఇంతలో వశిష్ఠులవారు, సుమంతుని పిలిచి, మంత్రీ! మీరు వెంటనేవెళ్ళి ముహూర్తము సమీపించుచున్నదనియును, దానికి పూర్వము గావించవలసిన పనులు అనేకములున్నవనియును, తక్షణమే మహారాజు యిక్కడకు వేంచేయ వలసియున్నదనియును, మహారాజుగారితో చెప్పి రమ్ము. వశిష్ఠులవారు తమరాకకై నిరీక్షించుచున్నారని కూడనూ తెలుపుమని కబురంపెను.

ఏ అంతఃపురము నందయిననూ యథేచ్ఛగాపోయే అధికారము సుమంతునికి యుండుటచేత 'సుమంతుడు' అతి వేగముగా నడచి కైకేయీ అంతఃపురమును ప్రవేశించెను.

సుమంతుని స్తోత్ర పారము

సుమంతుడు శయ్యాగృహమును ప్రవేశించగనే, సుమంతునికి యేమీ తోచలేదు. నేల పడిన దశరథుని చూచి, తాను ఆశ్చర్యపడి, తాను భ్రమించుచున్నానా అనునట్లు దిగ్భ్రాంతిచెందెను. దగ్గరకువెళ్ళి రాజా! చంద్రోదయసమయమున సముద్రునివలె సంతోషించవలసిన

మీరు, యిప్పుడు ఏల ఈరీతిగా పడియున్నారో అర్థ మగుటలేదు! మహా శుభసమయము ఆసన్నమయినది. వేదవేదాంగ పారంగతులు సంసిద్ధులై తమరాకకై వేచి యున్నారు.

తామిక లేచి, మంగళాలంకారములు చేసికొని కాంతులతో తేజరిల్లుచూ, సభా భవనమునకు రావ లెను. వశిష్ఠులవారు మిమ్ము తోడ్కొనిరమ్మని ఆజ్ఞాపించిరి.

అని అనేక విధముల దశరథుని మేల్కొలుపు చున్న పలుకులు దశరథుడు విన్నాడు. దశరథుడు దుఃఖమునాపుకొనలేక పోయినాడు. బోరుమని యేడ్చుచూ

సుమంతా! నీస్తోత్రపాఠము నా హృదయమును చీల్చివేయుచున్నది అని జాలిపుట్టునట్లన్నాడు. ఆ మాటలను వినిన సుమంతుడు ముందుకు పోలేకపోయినాడు. వెనుకకు నడవలేక పోయినాడు. చేతులు జోడించుకొని, రాజా! యేమి ఈవింత? యెంతో ఆనంద పడవలసిన ఈసుసమయమున మీరింత విచారించుటకు కారణమేమి? నాకేమియూ అర్థము కాకున్నది.

కైకేయి ఆజ

అని సుమంతుడు కూడనూ విచారముతో నిలచి యున్న సమయమున కైకేయివచ్చి, ఓ! మంత్రిపుంగవా

రాజు ఈ రాత్రియంతయూ రాముణ్ణి గురించి చింతించి చింతించి జాగరణ చేసిరి. మీరు వెంటనే వెళ్ళి రాముణ్ణి ఇక్కడికి తోడ్కొని వచ్చిన, విషయములు విశదముగా వెల్లడి యగును. నేను చెప్పుచున్నానని నీవు వేరుగా భావించక రాముణ్ణి తక్షణమే తోడ్కొని రమ్ము అని తెలిపెను.

ఆమె ఆజ్ఞనే రాజాజ్ఞగా భావించి సుమంతుడు అతి వేగముగా రామమందిరమునకు వెళ్ళుచుండెను. మందిరము చెంత సింహద్వారముల కిరుప్రక్కలా, వీధులలోను కట్నములతో పన్నీరులతో పుష్పగుచ్ఛములతో బారులుదీరిన జనసమూహమును కన్నులపండువుగా చూచుచు సుమంతుడు వెళ్ళుచున్నప్పటికినీ సుమంతునకేదియూ కొరత పడినట్లుగా తనలోతాను అయోమయస్థితిలో మునిగివాడు. కొన్నినిమిషములకు పూర్వమున్న ఆనందము అతనిలో అడుగంట జొచ్చెను.

సుమంతుడు రథమును తీసికొని రామభవనమునకు వెడలుచుండగా, లక్షలాది ప్రజలుచూచి, రామచంద్రుని పట్టాభిషేకమునకు తోడ్కొని వచ్చుటకై సుమంతుడు వెళ్లుచున్నాడని, మరింత ఆనందముతో ముఖములు వికసింపచేసుకొనిరెప్పవాల్చక వీధులలోనికి చూచుచుండిరి.

ఇంతలో సుమంతుడు రామభవనమున ప్రవేశించెను ఏడు అంతస్తుల అంతఃపురములోనికి యే అడ్డూలేక, ప్రవే

శించెను. మహానదగర్భములోనికి ప్రవేశించే మొసలివలే, అతి వేగముగా చేరెను.

అక్కడ రాముని మిత్రులైన కొంతమంది యువకులు ఉజ్వల కుండలకాంతులతో ప్రజ్వరిల్లుచూ రాముని వెంట వచ్చుటకై సంసిద్ధులై యుండిరి. మరింత లోనికి ప్రవేశించగనే, రాముడు, అలంకారముతో. కన్నులు మిఱుమిట్లు గొల్పు కాంతులతో, చిత్తానక్షత్రములోని చంద్రునివలె కనిపించినాడు.

అంత ఆలస్యమునకు చోటివ్వక, "రామా! కైకేయి దేవిగారునూ, నాన్నగారునూ తక్షణమే మిమ్ము కైకేయి మందిరమునకు తీసుకొనిరమ్మని నన్ను పంపిరి. అందు నిమిత్తమైనేనిక్కడకువచ్చితిని, అని సుమంతుడుతెలిపెను.

ఆ మాటలు విని తక్షణమే, రాముడు సీతను చూచి, సీతా! నీకు తెలియును. ఇది యేదో అంతరాయము కలుగు సూచన తప్ప మరేమీకాదు. తండ్రిగారి ప్రీతికై వారి ఆజ్ఞను మీరకూడదనియూ, వారిని బాధపెట్టకూడదనియు, నేను అన్నింటికీ సరిసరి అని అనవలసివచ్చెను. కానీ, నాకు ఈ విషయము తెలియక పోలేదు,

తెలిసిననూ, నేను కర్తవ్యమును నిర్వర్తించవలసి యుండుటచే, అట్లు ఒప్పుకొనవలసి వచ్చెను. అని ఇంకా యేమేమో చెప్పుచుండగా, సుమంతుని గుండెలో బండ బడినటులయినది.

తాను చూచి వచ్చిన దశరథుని పరిస్థితిని, రాములు చెప్పుమాటలనూ తాను జోడించుకొనుటచే, ఇది నిజముగా యేదో అంతరాయము కలిగించునట్టిది గానే అతనికి అర్ధమయినది.

సమాన ఆనందము

ఇంతలో సీత, "నాథా! యేమిటి మీమాటలు! ఈ శుభసమయమున మీరిట్లు మాటాడరాదు. ఏవియెట్లయిననూ సరే! మామగారి మాటను నిలబెట్టవలెను. వారితృప్తియే, మనతృప్తి! వారికై మనము యెట్టి త్యాగమునైననూ చేయవలెను. వారి ఆజ్ఞను జవదాటక తక్షణమే వెళ్లిరండి.

అభిషేకమైననూ సరే కాకపోయిననూసరే రెండింటికీ మనము సమానఆనందమునే పొందవలెను.

కైకేయిదేవికి మనపై అమితమైనప్రేమ; ఆ దేవి యేమి చేసినా యేమీచెప్పినా మనమంచికే.

కైకేయికంటె అధికముగా మన మేలు కోరువారు ఈ లోకమునలేరు. అట్టితల్లీ తండ్రీ తక్షణమే రమ్మనమని కబురంపిరన యెంతో ఆనందము!

అని ఆమె కూడనూ ద్వారమువరకూ రామునితో వచ్చి అనేక రకముల రామునికి నచ్చచెప్పి, పంపెను.

రాముడు, సీతా! నాకు అంతమాత్రము తెలియదా?

రాబోవు గడియలు ఇప్పుడు జరుగు గడియలు గడచిన గడియలు అన్నీ నాకుసమానమే. నేనన్నింటికీ ఆనందముతో స్వాగత మిత్తును. తండ్రి కీర్తిని గోరి నేనేమైనను చేతును; ఎక్కడికైనను పోదును. నీవు కూడనూ దీనికి తోడగుట నాకెంతయో ఆనందమని సీతతో తెలిపి సుమంతునితో బయలుదేరి వీధిలో నిలిపిన రథముపై కూర్చొనగా వీధిలోని ప్రజలు రామచంద్రప్రభువుకు జై జై జై: అంటూ జయ జయ ధ్వనులు గావించిరి.

అంత సుమంతుడు ప్రజలకు నచ్చచెప్పుటకై ఇప్పుడు పట్టాభిషేకమునకు కాదు వెళ్లుట: మహారాజుచెంతకు వెళ్లుచున్నాము కనుక కాలవ్యవధిలేనందున రథమును వేగముగా త్రోలవలసివచ్చినది. తిరిగి కొన్ని క్షణములోనే రాముడు రాగలడు. మీరు తొందర పడకుడని వారలకు అర్థమగునటుల మంచిమాటలతో తెలిపి సుమంతుడు రథమును అతివేగముగా కైకేయీ మందిరమునకు తీసుకొని పోయెను.

( సశేషము )

# నామ జప సాధన

ఉ॥ శ్రీకరమూర్తి భక్తజన శ్రేయముగోరెడి సత్యసాయి నా
భీకర పాపచిత్తమును భీషణ పాపగుణాదులన్ తగన్
ఆ కనుదోయి వీక్షణల నల్లన మంచికి మార్చునట్లుగన్
నా కరముల్ ఘటించి యెద నమ్రతఁ జేసెద వందనంబులన్.

సత్యము సాయినామ జప సాధన నేర్పడు సర్వసౌఖ్యముల్
నిత్యము భక్తకోటికిల నీరజనేత్రుని మేటి దీవనల్
ముత్యము సాయిదేవుఁగను మూర్ధ్ని చిత్తమెయైన భక్తిచేన్
సత్యము సాయిశక్తి కలిసాగర మీదగ నావ యన్నచోన్.

అంధుడు దృష్టినొందె వికలాంగుడు పొందెను సుస్వరూపమున్
బంధుడవైతి వీవె యనుబంధములన్ సృజియించి, ప్రేమతో
నంధత రూపుమాపి యెదనంతను కాంతిని నింపు దేవ! నా
బంధుడ వీవె, నాదు భవ బంధ విముక్తిని జేయుమా ప్రభూ!

చిత్తము, శీల నాశనముఁ జేయగ సిద్ధమ యెల్లవేళలన్
విత్తము, చెప్పరాని కడువేదనలన్ సమకూర్చు నెల్లెడన్
ముక్తి తలంపు లేదు, పరమేశుని ధ్యానము దూరమయ్యె, నా
చిత్తము, విత్తమున్, దురిత చింతనలన్, సరిచేసి గావుమా!

పర్తి పురీశ, భక్తజన పాప వినాశ, ప్రభో! శివా! హరీ!
ఆర్తిని దీర్చి మమ్ము సతతంబును బ్రోవుము దేవదేవ! నే
కీర్తన సేయువాడ నినుఁ గీర్తన సేయని జన్మ, జన్మయే?
ధూర్తుడ నన్నుఁగాచి, యెద దుఃఖములన్నటిఁ బారద్రోలుమా!

ఆర్. వి. భాస్కరరావు, ఎం.ఎ.

# మరపురాని రోజు

మా తండ్రిగారు భగవంతునియందు భక్తిశ్రద్ధలు గలవ్యక్తి. వంశ పరంపరగా సంప్రాప్తమైన పౌరోహిత్యమే గాకుండా అచుట్టు ప్రక్కల గ్రామస్థులకు గురువుగా కూడా వ్యవహరిస్తుండే వారు, అప్పుడప్పుడు వారి శిష్యులుంటున్న గ్రామాలకు వెళ్ళి చాలా ఎక్కువరోజులు ఉండేవారు. నాన్నగారు యింటివద్దనున్న రోజులందు భజన మందిరంలో రోజుకు మూడు పూటలు కీర్తనలు పాడుతూ భజనలు చేసేవారు. వారువారిశిష్యుల గ్రామములో నుండు నప్పుడు నేను మూడు పూటల భజనలు పాడేవాడిని. నాతొమ్మిదవ ఏటనుండియూ నేను నిత్యసంకీర్తనలో భజన పాటలు పాడేవాడిని

నేను నాపసివయస్సునుండి ఎవరి అసంఖ్యాకనామములను భజనలలో పాడేవాడినో ఆభగవంతుని యొక్క. యీనాటి అవతారమును గూర్చి నాకు తెలిసినది. నామనస్సు ఆయనను చూడటానికి ఆరాట పడసాగినది. వెంటనే విమానములో వెళ్ళి 1971 మే నెలలో శ్రీవారి దర్శనముచేసి కొన్నాను.

బృందావనము, అనంతపురము ప్రశాంతినిలయము వారు ఎక్కడికి వెళ్ళితే అక్కడకు వారిని వెంబడిస్తూ రెండుమాసముల తరువాత యింటికి తిరిగివచ్చినాను. కానియింటి వద్దకూడను స్థిమితముగా నుండ లేకపోయాను. 1972 ఫిబ్రవరిలో వారిదర్శనము

నకు వెళ్ళితిని. మార్చినెలలో నన్ను పిలిచి ఆశీర్వదించి పంపించే వరకు అక్కడే యున్నాను.

మార్చి '2' తేదీ నాజీవితములో మగపురానిరోజు. ఆరోజున బాబాగారు నాపై ప్రేమ పూర్వకమైన ఆశీర్వాదములు కురిపించారు ఆక్షణమునుండి నాకు శాంతి లభించింది. వారిమాటలు ఎంతప్రేమపూరితములో నాహృదయాన్ని ఎంతగా కదలించినవో నా మానసిక భారాన్ని ఎంతతేలిక పరచినవో మాటలలో చెప్పలేను.

ఈ అశాంతిమయి లోకాన్ని సముద్ధరించటానికి ప్రభవించిన భగవంతుని యొక్క యుగావతారము బాబావారు. వారిని యేపరిస్థితిలో జూచినా ఎప్పుడూ ఒకేవిధంగా దయానిధిగా కరుణాస్వరూపునిగా ప్రేమమూర్తిగాకనబడేవారు. నేనువారిని అనంతపురములోని భగవాన్ శ్రీసత్యసాయి ఆర్ట్సు అండ్ సైన్సుకాలేజీ ఫర్ విమెన్ ప్రారంభోత్సవానికిముందుగ కొద్దిరోజులు పరిశీలనాత్మక దృష్టితో అనుసరించాను. వారు. వందలకొలది పనివారలు యింజినీర్లుచేసిన పనిని పరిశీలించి ఎంత చిన్న పొరపాటునైనా యిట్టేపట్టి చెప్పేవారు. కాని అందుకు వారు కోపపడటముగాని అశాంతికి గురి కావటంగాని జరిగేదికాదు. ఆతప్పు చేసినవారే, తమతప్పు స్వామి వారి దృష్టికి వచ్చినదే అని సిగ్గుపడి పశ్చాత్తాపపడెడివారు. వారి తప్పును మరల వారే సరిదిద్దుకొనేలా చేసేవారు కాని స్వామివారిలో మాత్రం కించిత్ విసుగుదల చిహ్నమైనా కనబడేదికాదు శ్రీవారు ఎల్లవేళల ఎంతో శాంతముగా పరిపూర్ణమైన ఆనందమూర్తిగా కనబడుతూ ఉంటారు.

శ్రీబాబాగారు నిర్విరామ నిష్కామ యోగమునకు సజీవోప మానము. వారు అనాసక్త కర్మయోగశిక్షకులు. నిత్యము ప్రతిజీవిని ప్రతిస్థితిలోను ఆపదలో ఆదుకొంటూ ఆనందాన్నందిస్తూ నిర్విరామ ముగా పనిచేస్తూంటారు. వేనకువేల రోగార్తులకు వారు దివ్యవిభూతి తోను లేక, వీపుపై ఒకసారి తట్టటంతోను, ఒకమాటతోను ఒక చూపుతోను లేక, ఒకదర్శనంతోను స్వస్థత చేకూర్చుచున్నారు.

వారు చేయలేనిది, వారికసాధ్యమైనది ఏదియూలేదు. నిజా నికి మనది అన్నదేదియూ మనలోకూడలేదు ప్రతిదీ శ్రీ వారికి చెందినదే. మనము మన అజ్ఞానమువలన విశ్వనియంతయైన ఆసర్వే శ్వరుని మరచి మనము చేస్తున్నాం మనము ఆలోచిస్తున్నాము. మనము మాట్లాడుతున్నాం అనుకొంటున్నాము; అదికేవలం మన భ్రమ మాత్రమే.

బాబావారుతనయొక్క అవతారోదయ ఫలాన్నిపూర్తిగా పొంద మని అందరినీ కోరుతారు. మీ మీ దుఃఖాలను అశాంతులను నాకు సమర్పించి నానుండి ఆనందాన్ని అందుకోమంటారు. భగ వంతుని ఏదో ఒక నామమును సదాస్మరిస్తూ ఆనామము యొక్క రూపమును హృదయములో ప్రతిష్ఠించుకోమంటారు. ఇత రులలోని మంచిని నీలోనిచెడ్డను చూస్తూమంచి అలవాట్లను పెం పొందించుకొని మంచిభావాలతో శీలాన్నితీర్చి దిద్దుకోమంటారు.

అందరిలోను భగవంతుడున్నాడు నుక అందరినీ ప్రేమించు అందరినీ సేవించు అందరినీ గౌరవించు మధురంగా మంజులంగా మితంగా మాటాడటం నేర్చుకో ఏమనస్సు మాటలు

పనులు విశ్వవ్యాపకుడైన భగవంతునికి పూజాభావంతో సమర్పించు కొనమంటారు.

మానవజాతి శాంతిసౌభాగ్యములతో తులతూగవలెనంటే భగవాన్ బాబావారి ప్రబోధములను అనుసరించటము కంటే మనకు మరో మార్గము లేదు.

గౌహతి లోహిత్ చంద్రదేవ గోస్వామి

## గొంతులోనికి కెమెరా

నేను హాస్పిటలులో నుండగా నా జీర్ణకోశము (కడుపు)లో గడ్డలేచిందని దానికి శస్త్రచికిత్స అవసరమని డాక్టరు నాతో చెప్పాడు. కాని నేనందుకు ఒప్పుకోలేదు—నేను ఇండియాకు వెళ్ళెదను, సాయి బాబాగారు నయం జేస్తారు అన్నాను. కొద్దిరోజుల తర్వాత మరల ఎక్సురే తీయటం మంచిదని వాళ్ళకి చెప్పాను.

వాళ్ళుకొద్దికాలం గడచిన తర్వాత మరిద్దరు గాస్ట్రోలాజికల్ నిపుణులను రావించి నాగొంతులోనికి ఒకగొట్టము (Tube) ద్వారా ఒక అద్దాన్ని లైటునూ కెమెరా ను దింపించి రంగు ఫోటో లు చాలాతీసి పరీక్షించి సాయంకాలంవచ్చి ట్యూమరు చిహ్నంగాని మరోరోగచిహ్నంగాని ఏమీకనబడటం లేదన్నారు. ఏదోకొద్దిగా గాస్ట్రైటిస్ అయియుండవచ్చు అదేమీ పెద్దరోగం కాదు అన్నారు.

నేను నవ్వుతూ సత్యసాయిబాబాగారు నాకు వివరణ జేసినారు అని చెప్పగా వాళ్ళునమ్మలేదు. At The Lotus Feet అనే 57వ పేజీలో బాబాగారి విషయంలో "గత్యంతరంలేవి పరిస్థితుల్లో అనేకమంది గొప్పడాక్టర్లు తప్పనిసరిగా వారి అభిప్రాయము లను మార్చుకోవలసివచ్చింది; భవరోగభిషగ్వరులగువారికి అసాధ్య మేముంది?" అనియున్నది,

బాబాగారు శస్త్రచికిత్సనుండి నన్ను తప్పించి కాపాడటం యిది రెండవసారి, కొన్నినెలలక్రితం డాక్టర్లు నాకు "హిస్టరెక్టమీ" చేయాలన్నారు. అప్పుడు కూడా నాకోర్కె మేరకు కొంతకాలం తర్వాత పరీక్షించి ఏవిధమైన దోషము కొంచము కూడాలేదన్నారు నేను ఆజన్మాంతము సత్యసాయిబాబావారి దాసానుదాసిగా ఉండటా నికి బాబానుప్రార్థిస్తున్నాను.

సాయిబాబావారు తమబిడ్డలపై చూపించుప్రేమను మాటలతో ఎవరూ వర్ణించలేరు....

న్యూయార్క్ ఎమ్మా వివసెంటు మేయర్స్



# ఆచరించి ఆనందించండి

(శ్రీవారి దివ్యబోధ)

మీరందరూ, విద్యార్థులు విద్యార్థినులు, ఉపాధ్యాయులు ఈబృందావనమున ఆనందకరమైన ఆధ్యాత్మిక విషయములను శ్రవణముచేయుచూ, మీమీహృదయముల పరిశీలించి పరిశుద్ధము జేసికొని, ప్రశాంతికి ఇబ్బందిలేక, ఆత్మతత్త్వమును అభ్యసించి, యోగధ్యానములను దైవోన్ముఖ మొనర్చి అనుభవజ్ఞులు అందించిన ప్రమాణపూర్వకమైన ప్రజ్ఞానమునందుకొంటూ కల్యాణవంతమై, నవోత్సాహముతో దీర్చి దిద్దినవారై, ఈసభలో కూర్చున్నారు.

రేపు ఉదయమునుంచి మీరు మీమీస్వగ్రామములకు దేహరీతిగా వెళ్ళవలసియున్నదిగాని మీహృదయములుభగవద్హృదయముతో కలిసినాయి అని నేనెంతో సంతోషపడుచున్నాను. సిరిసంపదలు ఆస్తిపాస్తులు వస్తువాహనములు డాలర్లు కరెన్సినోట్లు ఇవిస్థిరమైనవికావు; వీటినుంచి శాంతిసమాధానములు దొరకవు. సౌశీల్యమే ధనము; సదాచారమే సంపద; బ్రహ్మజ్ఞానమే సర్వైశ్వర్యము. చూచుచున్నాముగా ఆనాటిరాజులను ! ఈనాడు సామాన్య ప్రజలు, వారి సిరిసంపదలు వారి అధికారము ఐశ్వర్యము అన్నియూ అశాశ్వతములు. వానవచ్చి చెరువునిండిన కప్పలు పదివేలు దానిలో చేరుతాయి? వేసవికాలమున యెండిన తక్షణమే

ఒక తప్పుకూడ కనిపించదు; స్థానమానములు ముఖ్యములుకావు తనను తాను విడువని మరువని స్థానమును పొందవలెను.

రావణుడు, హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు, దుర్యోధనుడు వీరందరికీ విద్యాబలము తపోబలము ధనబలము దేహబలము అన్నియూ ఉండినను ధర్మబలము ఒకటి లేదు కాబట్టి పతనమే ఫలితమైనది. భారత యుద్ధమునకు ముందుగా దుర్యోధనుడు అర్జునుడు ఇద్దరూ యేకకాలమున శ్రీకృష్ణుని దగ్గరకు సహాయము కొరకు వెళ్ళినారు కదా! దుర్యోధనుడు తుచ్ఛమైన సైనికబలమునే కోరినాడు; దైవబలమునుతిరస్కరించినాడు. ఆయనకుQuantity ముఖ్యముగా కనబడినది. అయితే అర్జునుడు Qualityని అపేక్షించినాడు. నీవుంటే లోకమంతా నాపక్షములో ఉన్నట్టే అని పరమాత్ముణ్ణి పరమపెన్నిధిగా వరించి తరించినాడు.

త్యాగము సత్యము అనే రెండు చక్రాల రథములో జీవుడు ఆసీనుడైయుండి భగవంతుణ్ణి సారథిగావరించి ఆదరించి అనుసరించి ఇంద్రియములనే గుఱ్ఱములను మనస్సనే పగ్గముతో ముక్తి మార్గమనే రాజమార్గమున పోవుచు జీవితమును సార్థకము చేసికొనవలయును.

ఆ మార్గములో లభ్యమగు శాశ్వతానందముకొరకు, బాహ్య ప్రపంచములో లభ్యమగు తాత్కాలికానందమును విసర్జించుకొనవలెను. దీనికి ఆత్మవిద్య అత్యవసరము. మానవునిలో అంతర్గతమైయున్న పరిపూర్ణ విజ్ఞానమును వికశింపజేసే శిక్షణాక్రమ

మునకే విద్య అనే పేరు చెల్లును. మిగిలినవన్నీ కూటికొరకు పనికివచ్చే ఉపాయములు, తెలివితేటలు, శక్తి సామర్థ్యములు. పూర్వము విద్య విజ్ఞానముకొరకు, కృషి కూటికొరకు, యేర్ప డినదేకాని విద్య కూటికొరకు కాదని స్పష్టముగా తెలియు చున్నది. బహుళగ్రంథ పరిచయమువలన ఆర్జించిన విద్య వట్టి తలభారము. ఆచరణశూన్యమైన విద్యను యెంతకాలము నేర్చినను ఫలమేమి? ద్రవ్యనష్టము. కాలముయొక్క దుర్వ్యయము. కాలే జీలో మీరు మార్కుల్కోసము ప్రయత్నము చేయకూడదు; రిమార్కుల్ రాకుండ చూచుకోవలెను.

"విద్యా వినయ సంపన్నే" అంటారు. విద్యనుంచి విన యము సంపాదించుకోవలెను. ఇపుడు విద్యావంతులకు వినయమే శూన్యము. విద్యాపోషకులకు, విద్యార్థులకు, విద్యాబోధకులకు నిత్యము ఘర్షణలే. దీనికంతా మూలకారణము రాజకీయ వేత్తలే! విద్యార్థులు కాదు, ఉపాధ్యాయులు కాదు. విద్యా ర్థులు, పాపము, పవిత్ర చిత్తులు. వారి హృదయములు నిర్మ లము, నిస్వార్థము. దానికే నేనీదినము వారందరికీ తెల్లటి షర్టులు, ధోవతులు, చీరలు యిచ్చినాను. ఈ వైట్‌ఫీల్డ్‌లో వారి 'క్షేత్రములు' కూడ యే కల్మషములేక పరిశుభ్రముగా, పరి శుద్ధముగా నున్నవి. వీరిని ఒకరి స్వార్థము నిమిత్తమై 'రాజ కీయ' నాయకుల స్వార్థము కొరకై, రచ్చలుకొట్టి పెడమార్గ ములో పడవేసి, వారి అమూల్యమైన కాలమును దుర్వినియో గము చేసేది యెంత ద్రోహము! ఎంత తెలివి తక్కువ?

హృదయమనే ట్యాంకులో సదాలోచన, సహనము, ఆనందము, నిండియుండిన, దానిని సత్ప్రవర్తన అనే ట్యాప్ మూలముగా ప్రజలకు అందించవచ్చును. రాజకీయనాయకులు యువకుల శక్తిని మంచి మార్గమున వినియోగించక, వారి హృదయ పరిశుభ్రతను గుర్తించక, వారిని ఉద్రేకపరచి, పెడమార్గములోనికి త్రిప్పి, వారి విద్యార్జనకు అడ్డుతెచ్చి దేశ కళ్యాణమునకే ముప్పు కలిగింతురు. వారిలో రాగ ద్వేషములను పెంచి, విద్యనర్థించే వారి మనోబుద్ధులను కలహమార్గమునకు త్రిప్పెదరు. నిరపరాధులను హింసించి, ఆస్తి పాస్తులకు నష్టమొనరించి, అశాంతి, అల్లరులను అభివృద్ధిచేసిన, శాంతి, ప్రేమలతో పవిత్రమైన మైత్రీభావముతో చేసిన ఫలితముకన్న తక్కువ ఫలితమే లభించును.

భారతీయ సంస్కృతి విప్లవమార్గమునకు దోహదమీయదు. భారతీయులకు స్వాతంత్ర్యము లభించినదికూడ పరమ శాంతమైన పద్ధతులననుసరించటము వలననే. గాంధీగారు పవిత్ర హృదయముతో, దైవనామమును నాలుకపై నాట్యమాడించుచూ తనదీక్షను వీడక లక్ష్యమును వదలక హృదయములో ద్వేషాసూయాదులకు చోటివ్వక, పోరాడి, జయించినారు. కష్టనష్టములకు లొంగక భయాందోళనములకు చోటివ్వక వెనుకంజవేయక లక్ష్యమునుసాధించుటకు మీరు పూనుకోవాలి. విద్యార్థుల లక్ష్యము విద్యనార్జించటమే: ఈవయస్సులోనే అది సాధ్యము, దానికేది అడ్డువచ్చినా, సహించకూడదు.

విద్యార్థి స్థితియందు పిల్లలు శాంతి సంతోషములతో మెల గాలి: ఉపాధ్యాయులు కూడ శాంతి సంతోషములతో విద్యను బోధించవలెను. ప్రసన్నతనుకాపాడుకోవలెను. ద్రోణాచార్యులు అర్జుననకు ప్రసన్నచిత్తుడై విలువిద్యలోని పరమరహస్యములన్నిం టిని బోధించిరి: అయితే తన కుమారుడైన అశ్వత్థామునికి అంతమాత్రమునేర్పలేదు, గురువులనుప్రసన్నుని చేసికొనవలెను. అప్పుడే వారిలో వెలసియున్న విద్య అంతా శిష్యునికి అందును. అసంతృప్తితో బోధించినను అసంతృప్తితో అందుకొన్నను రెండూ నిష్ప్రయోజనమే: రెండూ వృథా కాలహరణమే.

మాతృదేవోభవ అని ఉపనిషత్తులు బోధించును. దేశమాతా దేహమాతా, ఇద్దరినీ మీరుబాగా ఆదరించి ఆనందింపజేయవలెను. బీహార్‌రాష్ట్రమున కొన్ని సంవత్సరాల ముందు భీకరక్షామము బాధించినపుడు ఒకకుటుంబములోని తల్లితండ్రి ఇద్దరు పిల్లలు(ఒక అమ్మాయి ఒకఅబ్బాయి) ఊరువదలి బయలుదేరి దక్షిణదేశమును చేరిరి. భర్త పాపము యెంతోశ్రమపడి పొట్టను యెండించుకొని కష్టపడ్డాడు. కృషించి, కృషించి చనిపోయినాడు. ఆ దుఃఖ ముతోనే తల్లి చాల కృషించి. భిక్షమెత్తుటకుకూడ బలములేక. యెంతో బాధపడినది. తెచ్చినదాన్ని పిల్లలకు పెట్టి వారి పొట్ట నిండిన తరువాత. యే కొంచెము మిగిలితే. దానిని తిని ప్రాణ పక్షిని దేహ పంజరములో చావనీక కాపాడినది.

కొన్ని దినములలో ఆమె చాల బలహీనమై. కదలటమే కష్టమైనది. పన్నెండేళ్ల పిల్లవాడు, అమ్మకు ధైర్యము చెప్పుచూ

తానే బయలుదేరి, దొరికినదాన్ని మొదటఅమ్మకుపెట్టి తరువాత తనచెల్లికిపెట్టి, మిగిలితే తాను తినేవాడు. ఒకనాడు అబ్బాయి యెంత తిరిగిననూ యెవరూ ఏమీ పెట్టలేదు. బాధకు తాళలేకపోయి నాడు. నడచుటకే ఓపికలేదు. ఒక శ్రీమంతుని యింటిముందర నిలిచికొని, భిక్షాందేహీ అని చాల తక్కువధ్వనిలో అన్నాడు. ఇంటి వరండాలో "ఈజీ చెయిర్" పై పేపరు చదువుచున్న షావుకార్ అబ్బాయివైపు చూచినాడు. భిక్షాందేహీ అని విని పించినది. అయితే, అక్షణమే, అబ్బాయి కూలిపోయినాడు. షావుకార్ గబ్బునలేచి, అబ్బాయిని పట్టుకొని, తొడపైకూర్చో పెట్టుకొన్నాడు. తరువాత, "రా: భోజనముచెయ్యి" అని పిలువగా అబ్బాయిలేవలేదు. ఏదో సీరసధ్వనిలో పలికినాడు. తనచెవిని అబ్బాయి నోటిదగ్గరపెట్టి వింటే. "అమ్మకు మొదట" అంటు న్నాడు. అంటూనే అతని ప్రాణము పోయినది.

ఆ అబ్బాయి తల్లిప్రేమ అటువంటిది. "మాతృదేవో భవ" అనేదాన్ని అక్షరశః ఆచరించి చూపించినాడు. తల్లి-తండ్రి-కొడుకు ఈ త్రిపుటి యేకత్వముగా మెలగవలెను.

బృందావనములో '30' దినములు మీరు అందుకొన్న అనుభూతులు, ఆనందము, విజ్ఞాన సుజ్ఞాన ప్రజ్ఞానములు, క్రమ శిక్షణ సేవాసక్తి వీటిని మీరు యెక్కడకు వెళ్ళినా మీ హృద యములో మీ వెంట జంట అండగా పెట్టుకొని తరించండి. వాటిని యేమాత్రము అలక్ష్యముచేయక, హృదయమున భద్ర పరచి, ఆచరణలో అనుసరించి అభివృద్ధిచేసికోండి.

నిజముగా ఈ అవకాశము మీకు జన్మజన్మాంతర పుణ్య ప్రభావమువలన దొరికినది. కానీ వేరుకాదు. మీకు ఆధ్యాత్మిక విషయములను ప్రబోధించిన ఉపాధ్యాయులుకూడ యెంత ప్రేమతో యెంత వాత్సల్యభావముతో క్యాంపులో పాల్గొనినార నేది చెప్పనక్కరలేదు. వారి హృదయములందు నిండియున్న ప్రేమబిందువులు, వారు స్వస్థానమునకు వెళ్ళునపుడు మీ దగ్గరకు వచ్చి మీ నుండి సెలవు తీసికొనేటప్పుడు కంటినీరుగా వెలువడిన దృశ్యమును మీరే మీ కన్నులతో చూచినారుకదా! ఇట్టి ప్రేమ కలిగిన ఉపాధ్యాయులను మీరుకూడ గౌరవించి ఆదరించి అనుసరించవలెను, కదా! మీ సద్గురువు మీ స్వామి మీ వెంటనే యెల్లప్పుడు ఉంటారు. కాబట్టి ధైర్యముగా సంతోషముగా మీ మీ గ్రామములకు బయలుదేరి, మీ తల్లిదండ్రులకు, మీ ఉపాధ్యాయులకు, మీ బంధువులకు స్నేహితులకు, అందరికీ మీరు ఇక్కడ అందుకొన్న ఆనందమును పంచి పెట్టండి.

31-5-72 బృందావనము

# యా విద్యా సా విముక్తయే

మొన్నమొన్ననే ఈ సంస్థకుచేరిన హాస్టల్‌కు శంకుస్థాపనచేసిన నన్నే ఈనాడు కాలేజీలో పాల్గొనుటకు ఆహ్వానింపబడటము నాకొక ప్రత్యేకమైన సంతోషమునందించుచున్నది.

అచిరకాలములోనే సర్వాంగసుందరముగా పూర్తిచేయబడి సంపూర్ణ సాధనాసంపత్తితో ఈ కాలేజీ నిర్వహింపబడటముచూచి నేను ఎంతో ఆనందిస్తున్నాను. ఒక లైబ్రిరీ, యింతగొప్ప ఆడిటోరియము, యింతపెద్ద హాష్టలుగల సంపూర్ణమైన కళాశాలగా దీనిని తీర్చిదిద్దటము మాటలతోనయ్యే పనికాదు. ఇంతగొప్ప ఫలితమును ఒకటిన్నర సంవత్సరములో సాధించటము అతిలోక మేధాసంపన్నులైన భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారికి ఒక్కరికే సాధ్యము.

వ్యక్తిగతమైన వారి ఒక్కరి ప్రయత్నమువలనను, వారి యొక్క పర్యవేక్షణలోను జరిగిన ఈ మహాద్భుతమును నేను గౌరవ ఆమోదపూర్వకముగా అభినందించుచున్నాను.

ఎంతోకాలముగా నేను ఊహించుచున్న విద్యాబోధనా విషయ సంస్కరణములు యిక్కడ అమలుజరపటము నాకెంతో ఆనందముగా నున్నవి. మనము స్వాతంత్ర్యము పొందిన తరువాత విద్యాబోధనా పద్ధతిని పూర్తిగా మార్చవలసిన అవసరమున్నదని అనుకోవటము జరిగినది. రాధాకృష్ణ కమీషన్ నుండి కొఠారి కమీషన్ వరకు ఎన్నో కమీషనులు నలుమూలలకు ప్రయాణించి, విచారించి, సమగ్రమైన సాక్ష్యాధారములతో, వివరణలతో, నిర్ణయములకు వచ్చి బోధనాపద్ధతుల వివిధస్థాయిలయొక్క అభివృద్ధికి సిఫారసు చేసినవి. వారి రిపోర్టులు బీరువాలలో భద్రపరచబడినవి.

దేశములోని విద్వాంసులు ప్రాచీన సంస్కృతీ సంప్ర దాయపు విలువలను పెంపొందించే పాఠ్యసముదాయమును స్కూళ్ళ లోను, కళాశాలలలోను తర్ఫీదునిచ్చి విద్యయొక్క నిజమైన లక్ష్యాన్ని ప్రత్యక్షముగా దర్శించుటకు కుతూహలపడుచున్నారు.

విద్యా సముపార్జన తప్పనిసరియైన ఈ కాలములో స్కూళ్ళ లోను కళాశాలలోను అవిధేయత మితిమీరిపోయినదని వింటు న్నాము. విద్యాసంస్థలలో నైతిక, ఆధ్యాత్మిక, వాతావరణ మును పెంపొందింపనినాడు తప్పనిసరిగా విద్యార్థులలో అవిధే యత తలయెత్తుతుందని మనము మరచిపోరాదు.

గాంధీజీ ఈ ఆదర్శముతోనే గుజరాత్ విద్యాపీఠమును ప్రారంభించినారు. 1920 లో ఆ విద్యాపీఠములో మొట్టమొదటి సారిగా పట్టాతీసికొనిన వారిలో నేను ఒకణ్ణి. అప్పటి మా నినాదము లేక మంత్రము. (మంత్రమనుటయే నిజముగ దానికి తగిన పదము.) గాంధిజీ విద్యాపీఠముకొరకు ఎన్నిక చేసిన నినాదము, "సా విద్యా యా విముక్తయే"—ఆ మంత్రముయొక్క నిజమైన అర్థము నైతిక, ఆధ్యాత్మిక, మానసిక బలములను ధైర్యమును యిచ్చి అన్ని విధములైన భయములనుండి దుఃఖ ములనుండి విముక్తి గలిగించునదియే నిజమైన విద్య. ఈ విద్యాసంస్థకూడ ఆ మంత్రమునే, గుజరాతు పీఠముకంటె ఎక్కువగా ప్రత్యక్షముగా, ఆచరణ పెట్టడములో విజయ వంతమైనది అని చెప్పుటకు హర్షించుచున్నాను.

మనదేశములోని స్త్రీలకు సమున్నతస్థానమునివ్వటములో జ్ఞానదృష్టిగల మన పూర్వీకులను అభినందించవలెను. గురువుగాను తల్లులుగాను వారినెంతో గౌరవించి, ప్రేమించి విశ్వవిఖ్యాతమైన ఆచారమును వారునెలకొలిపిరి. వేదకాలములోను తరువాత కొన్ని శతాబ్దములవరకును ఆధ్యాత్మిక విజ్ఞానముగల తల్లులు తమ సంతానమును వీరులుగాను, కళాకారులుగాను తీర్చిదిద్దిరి.

పరమ గురువు శంకరాచార్యులు కేరళనుండి కాశ్మీరు వరకు ప్రయాణించి అద్వైతమత ప్రచారణావిషయములో ఎందరెందరినో ప్రతిపక్షపండితులను ఓడించిరి. ఆ సందర్భమున కాశ్మీరులో ప్రఖ్యాతుడైన మండనమిశ్రునితో వాగ్వాదమునకు ముందుగ మండనమిశ్రుని భార్యయైన ఉభయ భారతి తీర్పునకు అంగీకరించెదననిరి. దీనివలన శంకరాచార్యులవారికి ఆ స్త్రీ మూర్తియొక్క విద్వత్తునందే కాకుండా పక్షపాతరహితమైన ఆమెయొక్క గుణమునందుకూడ గొప్పనమ్మకము కలిగియుండెనని అర్థమగుచున్నది.

ఆ కాలములో స్త్రీలు పవిత్ర వేదాంత గ్రంథ అధ్యయనములకు అనుమతించబడిరి. గృహముల్లో స్త్రీలేనిదే మత కార్యములు సంపూర్ణత్వమునొందెడివికావు. గృహిణిలేని గృహములో ఏ శుభకార్యముకూడ శాస్త్రోక్తముగా జరపుటకు వీలుండెడిదికాదు. మత సంబంధమైన కర్మలలో స్త్రీలకు ఆనాడు ప్రత్యేకస్థానమీయబడెను.

మధ్యయుగములో ఈ స్థితియంతయు తారుమారై ఇంటి లోను సమాజములోను స్త్రీ తక్కువస్థితికి దిగజారిపోయెను. రాజా రామమోహనరాయ్, స్వామివివేకానంద, దయానంద, మొ॥ మహ నీయులు మరల స్త్రీ, పురుషునితో సమానమైన స్థితికి రావట మునకు ఎంతో కృషినలిపిరి.

గాంధీజీ దేశస్వాతంత్ర్య ఉద్యమములో స్త్రీలను పాల్గొ నునట్లు చేసిరి. ఆనాడు తల్లులతోను, కుమార్తెలతోను, భుజం భుజం కలిపి పనిచేసిన సంతోషప్రదమైన రోజులను మా వంటి ముసలివాళ్ళము జ్ఞప్తికి తెచ్చుకొని గర్వపడుచున్నాము.

ఎంతో అభివృద్ధిచెందినవనుకొంటున్న పశ్చిమ దేశాలలో ఒక స్త్రీ ప్రధాని కావటమునకు యింకా యెంతో కాలముపట్టు వచ్చును. కాని సహజముగా చిరకాలమునుండి స్త్రీని గౌర వించే తూర్పు దేశములలో — మనకూ, సిలోనుకూ, ఇజ్రా యిల్‌కూ, స్త్రీ మూర్తులే ప్రధానమంత్రులుగా నున్నారు. జ్ఞానా నికి, విద్యకు సాంకేతికముగ స్త్రీమూర్తియైన సరస్వతీదేవిని మనము ఆరాధిస్తున్నాము.

మన సంస్కృతి, తల్లిగాను, భార్యగాను, కోడలుగాను సోదరిగాను అన్నిరకముల స్త్రీలను ప్రేమతో గౌరవించునట్లు నేర్పినది. మన లౌకిక సంస్కారభవనమునకు ఆధ్యాత్మిక సంస్కృతియే పునాదిగ నుండవలెనను విషయము మరువరాదు. అమూల్యమైన పురాతన సంస్కార పునాదులపై నేటి విద్యా భవనములను విద్వాంసులు నిర్మింప తలచుచున్నారు.

మన సంస్కృతికి ముఖ్యాధారములైన భక్తి. విధేయత్వము సమర్పణ మొదలైన ఈ గుణములను ఈ కళాశాలలో మనము ప్రత్యక్షముగా చూడగలము విద్యార్థినుల మనస్సులలోని ఈ సందేశము ఎట్లునాటబడెనో ప్రిన్సిపల్ చదివిన నివేదికవలన మనముకొంతవరకు గ్రహించగలము. బాలబాలికలు కళాశాలలో విద్యనభ్యసించే వయసు అతిశ్రేష్ఠమైనది. భవిష్యత్తునందువారు ఎట్లావుంటారో నిర్ణయించేది 16-24 సం॥మధ్యకాలమే. అందుచే ఈ (16-24) వయసే మనసును, శరీరాన్ని హృదయాన్ని సుగుణ సంపన్నులుగా తీర్చిదిద్దే ' యౌవనాద్భుత కాలము.

ఆనాటి గుజరాత్ విద్యాపీఠముయొక్క మంత్రము "యా విద్యా సా విముక్తయే" (మానవుని పత్రిబంధమునుండి ఏది విముక్తిని కలిగించునో అదియే విద్య.) భారత దేశ స్వాతంత్ర్య సముపార్జనానంతరము సత్యమేవజయతే మంత్రాన్ని మనం మన విద్యా విధాన చైతన్య శక్తిగా స్వీకరించాము. కేవలము ఉచ్చరించటముతోనే సరిపెట్టక మనకు వెలుగునిచ్చి దారిచూపే ఆవాక్యాల్ని తీసికొని ఆచరణలో పెట్టినపుడే ప్రపంచము నిజముగా సుఖసంతోషములకు నిలయమౌతుంది.

దేశములోని స్త్రీమూర్తులు మనోవాక్కాయ కర్మలతో. క్రమశిక్షణతో మెలిగిననాడు దేశమంతటికి క్రమశిక్షణాబద్ధ జీవితము సాధ్యమౌతుంది. ఆధ్యాత్మికాదర్శములు యెంతో ముఖ్యమను మాట మరచి విజ్ఞానశాస్త్రకారులు బాహ్య ప్రపంచమును గురించి తెలిసికొనుటకు ప్రయత్నిస్తు మరీ మరీ లౌకికమైన నాగ

రికతను కల్పిస్తు గందరగోళము అభివృద్ధిపరుస్తున్నారు.

ఈ దేశముయొక్క భవిష్యత్ ప్రణాళికలను తీర్చి దిద్దుటకు పూనుకొన్న విద్వాంసులు ఈ సత్యసాయి కళాశాలకు వచ్చి వారికెంతో సహాయకారిగానుండగల కొన్ని పాఠములను నేర్చుకొని వెళ్ళమని మరీమరీ కోరుచున్నాము.

విద్యావిధానమును సంస్కరించి సరియైన మార్గములో నడిపించుటకు విద్యారంగములో శ్రీ సత్యసాయి కళాశాల ఒక అద్వితీయమైన ఉదాహరణము.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు సంకల్పించి సరియయిన తమపర్యవేక్షణలో ఒక అద్భుతమైన విద్యాసంస్థను స్థాపించినందుకు వారికివే నా హృదయపూర్వక నమస్కారములు.

## సత్యం—సుందరం

నాకు 23 సంవత్సరములు. దాదాపు యెనిమిది సంవత్సరములనుండి నా ధ్యేయాన్ని తెలిసికొనుటకై కృషివిసల్పి చివరకు ఆత్మసాక్షాత్కారమే నా ఏకైక లక్ష్యమని భావించినాను. కాని, నా అహంకారమువలన నా జీవితములోకొన్ని ప్రతిబంధకములు యేర్పడి నా సాధనామార్గమును చెడగొట్టినవి.

వృత్తిరీత్యా నేనొక కళాకారుణ్ణి. కొంత నియమితకాల ములో పనిచేసే ఉపాధ్యాయవృత్తివలన నా మనుగడకు సహా యముగా కొంత కచ్చితమైన ఆదాయము వచ్చెడిది. ఈ మధ్య నేనువేసిన చిత్రాలు నాకు కొంత విజయాన్ని సమకూర్చినందు వలన, నా పరమ ధ్యేయాన్ని వెదకటము మరచిపోయి ప్రపం చపు వ్యామోహముల సుడిగుండములో చిక్కుకున్నాను. సత్యము యొక్క తేజోవంతమైన సౌందర్యాన్ని దర్శించే అవకాశము చిత్రకళాకారునికి లభించును. అయితే, యిట్లాంటి ఆధ్యాత్మిక పతనము విపరీతమైన బాధకూ, దుఃఖానికీ కారణమౌతుంది. ఇట్టి అగాధములో కూరుకుపోయిన నాకు యేదియుకూడ సరి యైన మార్గముగా గోచరించలేదు. నా నిరంతర చిత్రలేఖ నయే సాధనగా భావించి గొప్పశాంతిని పొందుటకు ప్రయ త్నించినాను.

ప్రశాంత వాతావరణమునందు ఎక్కడోయొకచోట ఒంట రిగా కూర్చుని భూమిమీదను, ఆకాశములోను ద్యోతమవుచున్న పరమాత్ముని దివ్య సౌందర్యమును చిత్రీకరించుట నాకు గొప్ప అద్భుతానుభవము.

దీనివలన క్రమక్రమముగా మానవునికి ఏకాంతజీవితమే సుఖదాయకమని తెలిసికొన్నాను. మానవుడు ఒంటరిగా తన ధ్యేయమువైపు పయనించి, ఆ ధ్యేయములో ఒంటరిగానే లయము కావలెనని గ్రహించాను.

అయితే, మహాత్ముల సాంగత్యము, సదుపదేశము మనకు

నమ్మకమును కలుగజేసి మార్గమును తేజోవంతముగా చేయును. అని పెద్దలు చెప్పుదురు కదా! నాకు జీవితములో అట్లాంటి మహాత్ములు లభించుదురాయని యెన్నోసార్లు విచారించాను.

తుదకు అకస్మాత్తుగా అనుక్షణము నన్ననుగ్రహించి కాపాడే యొక సద్గురువును. సన్మార్గదర్శకుని పొందగలిగాను.

వారు రచించిన గ్రంథములవలననూ. వారిని గురించి యితరులు వ్రాసిన పుస్తకములవలననూ శ్రీ సాయిబాబావారే నాయున్నతికి అవసరమైన బలమును గలుగజేయ గలరని నమ్ముకొనియున్నాను.

నేను బలము అని దేనినైతే అంటున్నానో అది నాలో నుండియే రావలయునని నాకు తెలుసునసుకొన్నప్పటికిని శ్రీ సత్యసాయిబాబావారి అపార కృపాపూరిత ఆశీర్వాదమువలననే నా ప్రయత్నము విజయవంతము కాగలదని వారినే ఆశ్రయించి ఆరాధించుచున్నాను.

కొంతకాలము క్రితము నా తల్లిగారుకూడ శ్రీవారి దర్శనము కావలయునని ప్రార్థనాలేఖ శ్రీవారికి మెల్బోరన్నుంచి వ్రాసిరి. స్వామి కృపతో ఆమెకు దర్శనమిచ్చిరి. అనాటి నుండియు ఆమె అనేక అద్భుతానుభవములు పొందుచున్నది.

మెల్‌బోర్న్, ఆష్ట్రేలియా ఎ. హాల్



# హృదయవాసి

పదిలైనులు పిచ్చిపిచ్చిగా వ్రాసి ప్రింట్ కొట్టిన తక్షణమే విద్యావంతులు అని ప్రఖ్యాతిపొందిన కవులుకూడ దానిని కాపీరైటు చేసికొని పేరు ప్రతిష్ఠలకోసము ప్రాకులాడుదురు. అయితే భగవంతుడు తన్ను కర్తగా యెక్కడకూడను చూపించలేదు. అన్నిటినీ సృష్టించి అన్నిటినీ పోషించి తనలో లయము చేసికొని, అన్నింటిలోను అంతర్యామిగా దాగియున్నాడు భగవంతుడు, పరిపూర్ణ త్యాగస్వరూపుడు.

జగత్తుయొక్క నిజతత్త్వమును తెలిసికొనే నిమిత్తము, దైవతత్త్వమునుచేరే నిమిత్తము మానవునికి తెలివిని అందించినాడు. కాబట్టి కర్మలవలన, చిత్తశుద్ధిని సంపాదించి జ్ఞానరత్నమును పొందవలెను. కర్తలేదని కర్మను మానకూడదు. విద్యుత్‌శక్తి యెట్టిది దానినిజతత్త్వమేమి అని తెలియకపోయినను, దానిని పలువిధములుగా నుపయోగించి ప్రయోజనములను మానవుడు పొందుటలేదా? కర్తయెవరు? దేహముకాదు, తనజడని దేహియే. తాను దేహి, దేహముకాదు అని తెలిసికొని మానవుడు స్థిరత్వమును, పూర్ణత్వమును, పవిత్రతను పొందవలెను.

అయితే, శ్రద్ధాభక్తులచే అట్టి జ్ఞాన సంపాదనకు అందరూ సంసిద్ధులు కావలెను. విచ్చలవిడిగా విషయవాసనల వెనుకపడి

విరాశావిస్పృహలతో జీవితమును పాడుచేయకూడదు. శ్రమ పడి క్రమక్రమముగా శ్రవణ మనన విధిన్యాసములను అభ్యాసము చేయవలెను. ఏ. బీ. సి. డీ అని పలికిన తక్షణమే ఆ భాషలో ప్రవీణులగుదురా?

తాను తనవారు తనది అని చెప్పుదురేగాని, తాను అంటే యెవరని బహుమందికి తెలియదు. తానెవరో తెలిసికొనేదే జ్ఞాన సంపాదనయొక్క ప్రథమసోపానము. చూడండి! ఆ చిన్నబాలుడు నచికేతుడు తన స్వరూపాన్ని నిరూపణచేసికొని నాడు. యముడు ఆయనకు యెన్నో ఆశలను చూపించి వరముల నిస్తానని నచ్చచెప్పినను, వాడు విషయవాసనలకు లొంగ లేదు. ఆత్మతత్త్వమునే బోధించ వలసినదని అట్టి ఉత్తమోత్తమ విద్యను ఆర్జించటము వలన, నచికేతుని కీర్తి శాశ్వతముగా నిలిచిపోయినది. నచికేతుడు నివృత్తి మార్గమననుసరించి తరించినాడు. ఆత్మానందముకంటె మించిన ఆనందము వేరులేదని ఆ బాలుడు తెలిసికొనినాడు.

మాయవలననే అజ్ఞానము పెరుగును. పరమాత్ముడు మాయకు అధిపతి. మాధవ అంటే, లక్ష్మికి ప్రకృతికి మాయకు భర్త, అధిపతి అనేదే అర్థము. "మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిం, యత్కృపా తమహం వందే, పరమానంద మాధవం" అనే శ్లోకార్థమును గమనించండి. పరమానంద మాధవం" ; మాయకు అధిపతి అయినచో ఆతనికి పరమానందము సిద్ధించును. అదిలేక సిద్ధించదు. ప్రకృతి

పరతంత్రుడయిన జీవికి పరమానందము లభించదు. పరమాత్మ స్వతంత్రుడు; వానిని స్మరించిన, వానిని హృదయవాసిగా కని పెట్టిన, ఆత్మానందమును పొంద వీలగును. పరతంత్రుడయిన జీవునికి, అదొకటే ఆనందమార్గము.

ఇట్టి ఉత్తమస్థితి ప్రాప్తించునాయని మీరందరు నిరాశ పడ నక్కరలేదు. మీకు కావలసిన ధృఢమునూ, ధైర్యమునూ భారత రామాయణములే అందించుచున్నవి. అర్జునుడు ఒకప్పుడు చాల ప్రేమతో చనువుగా కృష్ణునితో మాట్లాడుచూ, "కృష్ణా! నీ నిజ నివాసమెక్కడ, నీవు అన్ని చోటులలోనున్నావు సరే అయితే నీ బ్రాంచి ఆఫీసులుకావు, నేనడిగేది. నీ హెడ్ ఆఫీసు, నీ శాశ్వత కార్యాలయము ఏది, నాకు చెప్పవా? " అని ప్రశ్నించినాడు. దానికి చిరునవ్వుతో కృష్ణుడు "సర్వ భూతానాం హృద్దేశే" అని అప్పుడే నీకు బోధించినాను కదా! అన్నాడు. ఆ హృదయవాసిని స్మరించేది యెంత సులభము! సదాసన్నిహితుడైన వాని అనుగ్రహమును పొందటము ఎంత తేలిక!

(శ్రీవారి దివ్యబోధ)



# పుస్తక సూచి

1 పుస్తకముల వెలనూ పోస్టు మరియు రిజిస్ట్రేషను చార్జీలనూ మని యార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 విలువలోనున్న పుస్తకములు వాటి పోస్టు చార్జీలు క్రింద తెలియ జేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్ పోస్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోస్టుచార్జీ మరియు ప్రతి ఆర్డరుతోనూ రిజిస్ట్రేషను చార్జీ రూ. 1-05పై జతపరచి, కావలిసిన పుస్తకములను వివరముగా వ్రాసి పంపవలెను.

| | పేరు | వెల | టపాలచార్జీ |
|---|---|---|---|
| తెలుగు:—— | | | |
| 1. | సత్యంశివం సుందరం(1) | 4-00 | 0-40 |
| 2. | .. .. (2) | 4-00 | 0-45 |
| 3. | మణిమాల | 1-00 | 0-15 |
| 4. | భాగవత వాహిని | 4-00 | 0-25 |
| 5. | అర్పణ | 1-00 | 0-10 |
| 6. | సాయిరామ నామమహిమ | 1-00 | 0-10 |
| 7. | సందేహ నివారిణి | 1-50 | 0-20 |
| 8. | గీతా వాహిని | 4-00 | 0-40 |
| 9. | వనామృతము | 4-00 | 0-30 |
| 10. | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 11. | సాయిబాబాయెవరు | 1-00 | 0-10 |
| 12. | బోధామృతము | 0-50 | 0-10 |
| 13. | సాయిమహిమ | 1-00 | 0-20 |

| | | |
|---|---|---|
| 14. భజనావళి | 1-00 | 0-20 |
| 15. దివ్యోపన్యాసములు | 1-50 | 0-15 |
| 16. స్తుతి తరంగిణి (2వ భా) | 0-50 | 0-10 |

కన్నడం:——

| | | |
|---|---|---|
| 1. సత్యం శివం సుందరం | 3-50 | 0-30 |
| 2. జ్ఞాన వాహిని | 1-50 | 0-10 |
| 3. ప్రశాంతి వాహిని | 1-50 | 0-10 |
| 4. సందేహ నివారిణి | 1-50 | 0-10 |
| 5. ధర్మ వాహిని | 1-50 | 0-10 |
| 6. ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 7. ధ్యాన వాహిని | 1-50 | 0-10 |
| 8. ప్రశ్నోత్తర వాహిని | 1-00 | 0-15 |
| 9. గీతావాహిని | 4-00 | 0-25 |

మలయాళము:——

| | | |
|---|---|---|
| 1. సత్యం శివం సుందరం (2) | 4-00 | 0-40 |
| 2. 108 రత్నంగళ్ | 1-50 | 0-10 |
| 3. గీతావాహిని | 3-00 | 0-15 |
| 4. వచోరత్నంగళ్ (1) | 2-00 | 0-20 |
| 5. ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 6. అవతార మధురవాక్య | 2-00 | 0-20 |
| 7. డివైన్ వాల్కొటు ది స్టూడెంట్సు | 1-00 | 0-15 |
| 8. ధర్మ వాహిని | 1-00 | 0-10 |

ఇంగ్లీషు:——

| | | |
|---|---|---|
| 1. సత్యసాయి స్పీక్సు (1భా) | 4-00 | 0-25 |

| | | | |
|---|---|---|---|
| 2. | సత్యసాయి స్పీక్స్ (2భా) | 4-00 | 0 30 |
| 3. | ,, ,, (3భా) | 4-00 | 0-30 |
| 4. | ,, ,, (4భా) | 5-00 | 0-40 |
| 5. | ,, ,, (5భా) | 5-00 | 0-40 |
| 6. | ,, ,, (6భా) | 5-00 | 0-40 |
| 7. | ,, ,, (7భా) | 7-00 | 0-65 |
| 8. | సెలక్టెడ్ జ్యూయల్స్ (పద్యములు) | 1-50 | 0-10 |
| | ప్రశాంతి వాహిని | 2-00 | 0-15 |
| 10. | ప్రేమ వాహిని | 2-00 | 0-15 |
| 11. | ఉపనిషత్ వాహిని | 2-00 | 0-15 |
| 12. | సందేహ నివారిణి | 2-00 | 0-20 |
| 13. | గీతా వాహిని | 4-00 | 0-35 |
| 14. | జ్ఞాన వాహిని | 2-00 | 0-15 |
| 15. | భాగవతవాహిని | 5-00 | 0-40 |
| 16. | భజన్‌సాంగ్స్ | 2-00 | 0-20 |

అరవం:——

| | | | |
|---|---|---|---|
| 1. | భగవాన్ శ్రీ సత్యసాయిబాబా అరుళ్‌వాక్కు | 2-00 | 0-15 |
| 2. | అన్‌బిన్ జ్యోతి | 2-00 | 0-20 |
| 3. | సత్యం శివం సుందరం (1వ బా) | 3-50 | 0-40 |
| 4. | ,, (2వ బా) | 4-00 | 0-30 |
| 5. | భజనావళి | 1-00 | 0-15 |
| 6. | అవతారమొళిఅముదం (1వ భా) | 3-00 | 0-30 |
| 7. | ,, ,, (2వ భా) | 3-00 | 0-35 |
| 8. | సాయిమాత | 1-00 | 0-10 |

| | | |
|---|---|---|
| 9. ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 10. సందేహవివారిణి | 2-00 | 0-25 |

హిందీ:——

| | | |
|---|---|---|
| 1. సత్యసాయీశ్వరాయనమః (పద్యములు) | 1-00 | 0-10 |

బెంగాలి:——

| | | |
|---|---|---|
| 1. ధ్యానవాహిని | 1-75 | 0-10 |

గుజరాతీ——

| | | |
|---|---|---|
| 1. అమృత్ వాహిని | 2-00 | 0-20 |
| 2. కథాసుధ | 2-00 | 0-15 |

సింధి:—

| | | |
|---|---|---|
| 1. భజనావళి | 0-50 | 0-10 |
| 2. ధ్యానవాహిని | 1-00 | 0-15 |
| 3. ప్రశాంతివాహిని | 1-50 | 0-10 |
| 4. సత్యం శివం సుందరం (2వ భా) | 4-00 | 0.40 |

మేనేజర్, సనాతన సారథి.



## గమనిక.... పత్రికల చందాలు, పుస్తకముల ఆర్డర్లు

**1.** ప్రశాంతి నిలయము నుండి తెలుగు మరియు ఇంగ్లీషు భాషలలో మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా : 4 రూ॥ ఒక సంవత్సరమునకు తక్కువకాని 5 సం॥ల కెక్కువకాని చందాలు స్వీకరింపబడవు.

**2. చందాలను పంపించునప్పుడే ఈ క్రిందివివరములను సుస్పష్టముగా తెల్పవలెను.**

ఎ) మొదటిసారిగా చందాలు పంపేవారు "క్రొత్తచందాదారు" అని వ్రాయవలెను.

బి) ప్రస్తుతచందా గడువుపొడుగించుటకు, తన చందానెంబరును చందాపంపించు సమయమునందే తెలియచేయవలెను.

సి) తెలుగుపత్రిక కావలెనో, లేక ఇంగ్లీషుపత్రిక కావలెనో స్పష్టముగా వ్రాయవలెను

డి) చందాదారు తన పేరును పూర్తివిలాసమును స్పష్టముగా తెలియునట్లు వ్రాయవలెను. M.O. ద్వారాచందాను పంపించువారు వారిపేరును, పూర్తి విలాసమును M.O కూపను వెనుకభాగమున వ్రాయుట అత్యావశ్యకము.

**3.** పత్రికలుగాని, పుస్తకములుకాని V.P.P. ద్వారా పంపబడవు. పుస్తకములుకావలసినవారు, వాటివివరములను పైకముతోపాటుగా తెలియపరచవలెను. (M.O. ద్వారా పైకముపంపువారు కూపనులోనే కావలసినపుస్తకముల వివరములను తెల్పవలెను)

**4.** పత్రికకుగాని పుస్తకములకుగాని పైకమును పంపించువారు తమచెక్కులను డ్రాఫ్టులను, పోష్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను, "సనాతనసారధి", ప్రశాంతినిలయం పోస్టు అనంతపురంజిల్లా, ఆంధ్రప్రదేశ్" అను చిరునామాకు పంపవలెను. చెక్కులు పంపేవారు బ్యాంకి ఖర్చులనుకూడ కలిపి, మొత్తమును పంపవలెను. పత్రికగాని, లేక పుస్తకములుగాని, చెక్కుపైకము వసూలైన తరువాతనే పంపించబడును.

---

## ప్రకటన

ప్రశాంతినిలయములో నూతన నివాసభవనములు, క్రొత్త ఆడిటోరియం, షెడ్లు, మొదలగునవి నిర్మాణసందర్భముగ, శ్రీ సత్యసాయి ప్రెస్సునకూడా క్రొత్తభవనమునకు మార్చవలసిన అవసరము ఏర్పడుటవలన, ఎంత త్వరితముగ ప్రయత్నించినను, ఆగస్టు72 సంచిక ముద్రణ తప్పనిసరిగా ఆలస్యమగును, కాబట్టి, ఆగస్టు సెప్టెంబరు సంచికలు సెప్టెంబరులో ఒకే సంచికగా వెలువడునని చందాదారులు గ్రహించగోరుచున్నాము.

ఆంధ్రప్రదేశ్ అనంతపురం జిల్లా ప్రశాంతినిలయము నందలి శ్రీ సత్యసాయి ముద్రణాలయమందు యస్. కస్తూరి గారిచే ముద్రింపబడి, బి. వి. రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి ట్రస్టు తరపున ప్రచురింపబడినది. ఎడిటర్, యస్ కస్తూరి యం. ఎ., బి.

